


# శ్రీ పాండురంగశతకము



ఇయ్యది

నర్సారావుపేటతాలూకా కుంకులకుంట పురవాస్తవ్యులు

రాళ్లబండి యప్పలరాజు గారి తనూభవుండగు

యల్లమందరాజు కవిచేరచియింపబడి

పూసపాటి రంగరాజుకవి గారిచే సరిచూపబడి

కొల్లి వెంకటపతి ద్రవ్యసహాయముచె

లక్ష్మీముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

ప్రచురింపబడియె

నర్సారావుపేట

మొదటటికూర్పు 500

1936

# కృతిపతివంశావళి

---

శా॥ శ్రీరామాత్మ ఘనాబ్జసూర విలసత్క్షీరాబ్ధి సంచార మా
రారి బ్రహ్మ సురేంద్ర కుంభజన నారాద్యాదిస్తుతాచార సం
హారాహార్యాద్భుతవార భూరినరసింహా ధ్యత్కుం డుద్విస్సదా
పారంబైన ముముక్షు మిచ్చును హితంబా కొల్లి వంశేందుడౌ
పేరుం గాంచిన యాపిదెమ్మ్యకుం దొరకున్ వేలసా ళ్లెన్నగన్॥

సీ॥ శ్రీరామచంద్రుని సేవానురక్తులు ♦ గోత్రారి విభవులు కొల్లివారు
సత్కవీంద్రుల నెల్లసాకుచుండెడువారు ♦ గోవాడ గోత్రులు కొల్లివారు
తరుతటాకాదిస త్కృతులు సల్పినవారు ♦ గుణసమోపాధులు శ్రీకొల్లివారు
కులశకలంబులై కులగిరుల్ గదలిన ♦ కల్లలాడనివారు కొల్లివారు

గీ॥ విబుధపండితసజ్జనవినుతసతత ♦ శుభకరానందపరులందు సూనృతుండు
దర్పకాకారుఁడుత్తమధర్మపరుఁడు ♦ గల్గెపెద్దప్ప యాఖ్యుండు కల
యుగమున॥

చ॥ స్థిరముగ పెద్దఅప్పయ సుధీవరు నెన్నగ లక్ష్మిదేవమన్
పరిణయమంది ప్రేమగను బంధువులంత శుభాసనంగ వా
రిరువురుఁగూడి సువ్రతము లెవ్విధి భక్తిగ నాచరించి కో
గురుమతులైన పుత్రుల యకుంఠితులై గనిరిద్ధరాస్థలిన్।

క॥ వెంకటరామయ్య కనుజులు ♦ వెంకటకృష్ణయ్య విదియ వీరలతోడన్
పంకజ నేత్రిలు చల్లమ శంకముగా శేషమాంబఁ బుట్టిరి వేడ్కన్॥

గీ॥ కుతుకమలరఁగ చల్లమ్మ కొండ్రకుంట ♦ కులుడు వెంకటరామయ్యలలన
యయ్యె వేఁడుకలరగ శ్రీమల్లెపీరయకును ♦ పత్నియయ్యెను శేషమ్మ
ప్రవిమలముగ॥

క॥ వారికుమారులలో విస్తారముగా ♦ కీర్తిగాంచి సజ్జన నుతుఁడై
శేదాం దేవిదెయ చౌదరి ♦ గాంకిసరిసాటిగుణులు గలరాధాత్రిన్॥

ఉ॥ మారుఁడురూపమందునను మానుషమందు సుయోధనుండు మేల్
సూరతనందు నర్జునుఁడుసూనృతమందు త్రిశంక సూనుడున్
భూరి కవీంద్రసంతతిని పోషణఁజేయను భోజరాజు యీ
ధారణిలోన కొల్లికుల ధన్యుడటంచు విదెయ్య సోదరిన్
ఆరయుగాను భూపతులుహార్ణిశమున్ కొనియాడుచుందురా॥

చ॥ మనుజునకొక్క తీరుగను మాకలితుండయి జర్గుటేరికో
జననము జెంపటాదిగను చక్కని భోగము ధాన్యమున్ సిరుల్
తనివినిదీరగాంచె తుద దాఁకను కొల్లికులాబ్ధి చంద్రుడా
ఘనుఁడు విదెయ్య చౌదరని గాయక సత్కవి సజ్జనావలున్
వినుతులొనర్చ చంద్ర పృథివీపతులందరు మెచ్చఁగా భళీ॥

క॥ అలమట్టి రామలింగయ లలనామణి సీతమాంబ లకుపుత్రికయా
అలివేలమ్మను సతిగా సలలితముగఁ గొనియె విదియచౌదరిగారున్॥

మ॥ అలివేలమ్మ విదెయ్య సద్గుణముతో యజ్ఞాత్మునిన్ గూర్చియే
ఫలిత [illegible] వ్రతమాచరించిరో సదాభవ్యాత్ముడౌ పుత్రుడున్
గలిగెన్ మారసమానమూర్తి విలసత్ కామారి సద్భక్తుడున్
లలితానంద సుఖప్రదాయి సుజనోల్లాసుండునై యిద్ధరన్॥

సీ॥ పాలసంద్రములోన భవముఖామరులు మెచ్చ చంద్రుడుద్భవమైనసరణిగాను
హరిరమామణికినినల్లారుముద్దుగాప్రద్యుమ్నుఁడుదయించుపగిదిగాను
భావింపగాశచీదేవి యింద్రులకును అలజయంతుడు గల్గినట్లుగాను
పరికింపగను యక్షపతి చిత్రరేఖకునలకూబరుండుఁను గలుగురీతి;

గీ॥ వాసిగాంచినశ్రీకొల్లివంశమందు వేడ్కతోఁడవిదెయ్యఅల్వేలమకును
గర్భముక్తాఫలంబనిగల్గెభళిర వేంకటపతి సునాముండువిమలగుణుడు॥

చ॥ పటుతరమైన గాడ్పునకు పర్వతశ్రేణియు క్రిందుమీదుగా
నటుయిటుఁ దూగులాఁడినను యంబుధులెల్లనునింకి వహ్నికిన్

దిటవుగ చైత్యమువ్చినను ధీజనపాత్రుఁడు సద్గుణుఁడు వెం
కటపతి పల్కబొంకడని గణ్యతగాంచెను కమ్మవారిలో॥

సీ॥ తల్లిదండ్రులభక్తిఁ దప్పక నిరతంబు పూజించునట్టిసత్పురుషుఁ డెవరు
యఖిలార్థిజనులను నాదరించనుకల్పభూరుహంబనునట్టిపురుషుఁడెవరు
ప్రతిదినంబును దైవభక్తి నేమారనిసూనృతవాక్యుఁడౌసుమనుఁడెవరు
పండరీ నిలయుఁడౌ పాండురంగని పేర శతకంబుజెప్పించుసరసుఁడెవరు

గీ॥ అమలగుణుఁడైన తండ్రికి యంకితముగ♦ కృతిని రచియింపుమన్న
శ్రీచతురుఁడెవ్వఁడనఁగ శ్రీకొల్లివంశాబ్ధియబ్జ♦ వైరిభావభవమూర్తి
వెంకటపతియటండ్రు

సీ॥ పాటింపగనుగొట్టిపాటి సత్పట్టణమందున గుంటుపల్లాన్వయుండు
సత్యవంతుండునుసాహసోల్లాసుండు వెంకయ్యనాముండువిమలగుణుఁడు
మణియనందగును రామమ్మను పెండ్లాడె నాదంపతులకు
దామోదరుండు♦తనివిదీరంగ సంతతినిచ్చె పుత్రుల పుత్రిక లందులో
పుణ్యవతియు

గీ॥ పరమగుణవతియైనబడు పద్మనయనజలదనిభ వేణిశుకవాణి చంద్రవదన
సత్కవీశ్వర బుధజన సమితిమాత స్వాధిమణులందు తులశమ్మ
సాటిమెవరు॥

గీ॥ క్షీరసాగరపుత్రిని♦ శేషశాయి♦పెండిలిసి యాందువిధ
మున ప్రేమదనర♦పరమపతిహింతులశమ్మనరసిపెండ్లి
యాడె వెంకటపతి పండితాళిమెచ్చ॥

గీ॥ పతిని దైవంబటంచును భావమందు♦దలఁచి నేత్రోద్భుభర్తకుఁదగినపూజ
సల్పుచుండును సావిత్రిసత్యవంతు ♦ లారయంగను నటియించి
రావింధంబు

క॥ గౌరీ వాక్సతి లక్ష్మి భూమణియును సుగుణముల పోల్గొనితా
ధారణిలో జన్మించెను బౌరా యీతులశమాంబ యండ్రు బుధేంద్రుల్॥

సీ॥ అత్తమామలకును చిత్తమురంజిల్ల♦హృదయంబునను లేచి ముదమెలర్ప
ప్రాతస్నానంబు యుపలరంగా జేయించి♦నిర్మల విధోవతుల్ నేర్పుగాను
యిచ్చియు పిదపను యుష్ణపదార్థముల్ ♦ కుడువబెట్టిన వెన్క కోరికలర
పట్టెమంచము పన్ని బాలీసు తలగడ♦భక్తిగా జాపర్చి పండుమనుచు

గీ॥ పదములొత్తుచునుండి పకదల కొండ♦నిద్దురను బుచ్చి తాగ నిర్వహించు
వనితలెవ్వరిటంచును మనములలర యఖిల జనములు తులశమ్మ
నందురిలను॥

సీ॥ భర్తతో మొసరాదు పద్మగంధియు గాను ♦ పరుల సొమ్ములకును బరు
గులిడదు। యిరుగు పొరుగులనున్న యింతులతో నైన♦ కలహ
మాడనియట్టి కలువకంఠి। పెద్దల పిన్నల ప్రియబంధువుల
గాంచి ♦ తగు సపర్యలు జేసి ధవునితో। భక్తి మీరంగ సప
ర్య మంచిగ జేసి వర్తించుచుండు నవార్యరితముగ

గీ॥ మనసు నొప్పించ దెంతయు మంచిగాను ♦ యనుగుణంబుల తులశమ్మ
యనయమధిక। ప్రేమతో భర్త యనుమతిగా మరి♦ధరణి చెన్నొం
దె సాధ్వీమతల్లియనుచు॥

గీ॥ సంతతిని లేక దంపతుల్ చింతనొంది♦ పరహితుండగు యేజండ్ల పాప
యకును॥ తనసుతో బుట్టు సుబ్బమ్మ తరుణియయ్యె♦ వారిగర్భంబు
నందున కోరికలర। తనయగాగల్గె నాగరత్నమను తులసి♦ మాంబ
వెంకటపతి గర్భమునందు జనన♦మైనరీతిగ బెంచిరి హర్షితంబు॥

గీ॥ తిరముగా కొండ్రకుంట శ్రీతిరుపతయ్య సుతుడు కోటయ సద్గుణ
స్తోమమునకు♦భావములరియు వెంకటపతియు తనను♦ యింటయిల్లిట
ముగనుంచి హితవుగాను॥

గీ॥ నాగరత్నమనిచ్చి భూనాథులెన్న। పరిణయముఁ జేసె మిత్రులుఁ బంధు
వులకు సంతసంబును జెందిరా సమయమందు। కోటికలరగ కుంకిళ్ళ
కుంటయందు॥

గీ॥ దనరకోటయ నాగరత్నమకు పూర్వ। పుణ్యవశమున బంగారు బొ
మ్మవలెను। గర్గె వెంకటసుబ్బమ్మ గర్భమందు। తాతముత్తవలను
ముద్దుదనరునటుల॥

సీ॥ దనరె కుంకలకుంట దక్షిణభాగంబు యిరుమెళ్ళకుచు తూర్పుగనుఁ
జెలంగ। బడుకర్లకుంటకు పడమరగా బుచ్చిపాపన్న పాలెము కేపు
మీరవృత్తరమున నాల్గుప్రాళ్ళమధ్య ♦ సమస్తపశుమ్మ గాళికి నెల్ల భావములర
జీవనాధారంబు కై విదియాఖ్యుండు ♦ కమనీయమహా తటాకంబునిల్పె
ఆనీరుదాత్రివిన మానవుల్ తోషించి ♦ కండచక్కెర పానకంబు తేనె

గీ॥ గల్పిమ్రింగినయాతీపిఁ గానరాదు ♦ కాశితీర్థంబునకుమించగలదటంచుఁ
బల్కరాగడ్డయెత్తిన ఫలితమే మొ ♦ దాతనుత్తముడౌట యాదరిద్ర
మహిమొ ♦ లేకగల్గునె యాఖ్యాతి లోకమందు॥

సీ॥ ముందుదయోబోతుల నెందరో వేసిరి ♦ గానిసద్వృద్ధులు గల్గిజనులఁ
జూడచిమెరుంగదు పొలమునకేతెంచి ♦ వక్కచేలో నైనదొక్కనిండ
తినిమెయుంగదుఁ జూచితిట్టరు యెవరైన ♦ బాలురు స్త్రీలు నిర్భయముగాను
దాపుకుఁజని దువ్వితరిమిన పైబడ్డ ♦ తలద్రిప్పిబుస్సని దర్పమించు
కై నజూపించదటంచు పిన్నలు పెద్ద ♦ లభినుతింతురు దానియందు వెంక

గీ॥ కేశుఁడే నిల్వకున్నను యిట్టిగుణము ♦ లుండునాయంచు బల్కును
రుర్విజనులు। వాసిగను శుక్రినామ సంవత్సరమున ♦ చైత్రబహుళ
చతుర్దసి సరసులెన్న ♦ అచ్చుగొత్తించిరా విదియాఖ్యు పేర॥

గీ॥ తనువులెప్పటికిని శాశ్వితంబుగా ♦ దటంచు వెంకటపతియు మోదించి
మదిని ♦ సప్త సంతానములలోన సత్కవిత్వ ♦ మేఘరాస్థలి శాశ్వి
తంబేయుటండ్రు॥

క॥ వరరాళ్ళబాడి సత్కుల శరధికి విధు ♦ డప్లరాజుజగ్గముసుతుడైఁ
బరగిన మందమురాజును ♦ స్థిరముగ బిల్పించికృతిని జేయింతునని॥

క॥ అనినన్ను బిల్వనంపియు ♦ వినుమోకవి పాండురంగవిఠలునికృతి మా
జనకునకంకితమిచ్చియు ♦ దనరగరచియించుభూమి దానంబిత్తుఁ॥

---

# శ్రీ పాండురంగ శతకము

సీ॥ శ్రీభార్గవీ మృదుచిత్తపద్మపతంగ। అవనీరథాత్మజాస్త్రవ్రసంగ
పండితవర్ణిత పతగరాజతురంగ సంతతదీన కృపాంతరంగ
నిరుపమలాలిత్య నిర్మలనీలాంగ భూపాలకుల చిత్రచాపభంగ
మునిబుధానంద ప్రపోషిత సారంగ దీపిత కోటీరధృతవరాంగ

గీ॥ సకలగోపకులాంగనా చలితపాంగ
కలితవళిజత రయవిగంగాతరంగ
విదితకొల్లివిదెయ్య సద్భావ దయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 1

సీ॥ శ్రీకరగౌరీశ పాకారిముఖనుత। విప్రాళిపూజిత విమలచరిత
పండితజనకృత పాపమండనహాత। వరమిమ్ము నన్మనివర్గ విహిత
సామజవరద సుజ్ఞానసందీపిత। నళినాప్త కుముదాప్త నయనధరిత
హితభక్తదీన కపీశ్వర పోషిత। ధృతమతివర వసుదేవ జనిత

గీ॥ నిక్కముగ నన్నుబ్రోచుటే నీదుఘనత
పర్వతాగ్రింబె నీకెప్డు పరమనసత
విదితకొల్లివిదెయ్య సద్భావదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 4

సీ॥ వర్ణితసద్గుణవైభవ సూత్రామ। నళిననిభేక్షు జనాభిరామ
శూలివాగ్వ గసుర సేవితామలసీమ। పూషకులాంబుధి పూర్ణసోమ
కవిజనావళిచిత్రకదనశాత్రవభీమ। గురుబుధవంద్య వైకుంఠధామ
రాజితచారిత్రి రాజరాజలలామ। విప్రజనామోద విజితకామ

గీ॥ నిన్నువర్ణింతుఁజూపుము నీదుప్రేమ
సప్తగిరివాన భువనసంస్తవసునామ
విదితకొల్లివిదెయ్య సద్భావదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 3

సీ॥ కనకాద్రిసమధీర కందర్పసమరూప । గానప్రవీణ సత్యానులాప
సన్నుతామరగాత్ర శంకరాకరరోప । రమణీయవేష సూర్యప్రతాప
కారుణ్యసాగర ఖండనశివచాప । సామజవరద యశఃకలాప
ధీజనావనదేవదివ్యమానిక్లేప । పాపసందోహబ్రి పవనరూప
గీ॥ రత్నమణిమయహార ధర్మాదిదీప
రాజరాజేశ్వరుండవు రామభూప
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 4

సీ॥ శ్రీరమాధవనీదు సేవనిత్యముఁదప్ప । నిఖిలవేల్పులయందునీవెగొప్ప
చక్కఁగానీనామస్మరణ సంపదకుప్ప । ముద్దుగానీగీము పెద్దతిప్ప
గాంగేయవసన నీశృంగారమును రెప్పు । వేయకఁజూతు నేవేఁడుకొప్ప
మంచిగానీనోటి మాటయేరికిఁద్రిప్ప । జాలరుపండితజాలముప్ప
గీ॥ తిలగరచియుంచితిని కృతిఫలితమొప్ప
ప్రేమచేతిను కడతేర్చవేమితప్ప
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశపాండురంగ॥ 5

సీ॥ ధర్మవర్తనుడయ్యు ధారుణినీతాత । యధికసద్యశముచేయలరెగాత
నీచక్రమును బెట్టి నిఖిలశత్రులఖాత । అప్రమేయుండగు హరునమేత
నివధూరత్నము నెరిజీవులకుమాత । సుతుడయ్యెనుతికెక్కెఁజూడధాత
నీకథల్ గానవి నేరించుచుటరోత । నిర్జరాధిపుడయ్యెనీకుఁభ్రాత
గీ॥ నమ్మియుంటినెఁగావవు నాదుగీత
వందనంబులు గైకొన వెందుచేత
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశపాండురంగ॥ 6

సీ॥ వామనావతార శ్రీవైకుంఠపురవాస। స్థిరభక్తజనహృది చిద్విలాస
మందరగిరిధీర మానితదరహాస। పోలుపుగాదీర్చితి బుధులతోసి
రాజీవనయన నిరామయరవిభాస। వాసవార్చితపోష వారదాస
అలివేలుమంగమాంబామణి వుల్లాస। మణిగణహార సద్గుణవిలాస
గీ॥ శ్రీకరంబుగనన్నేలు సింహరోస
దీనపోషణ నన్గని దీర్చుయూస
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 7

సీ॥ వాసవార్చితచిద్విలాసనీసత్వంబు - వర్ణించుటకును నెవ్వరివశంబు
పాపరక్కసులకు భయమునీకోపంబు। కవుల పైజాణపునీకరంబు
హితవగుతేనియ కెనయునీవాక్యంబు। సద్భక్తులకునీవుసమ్మతంబు
తులలేనివిభవంబుగలవాడవనిశంబు। కందర్పునకుంబోలుసుందరంబు
గీ॥ ఖలులసమయించు నీదుచక్రాయుధంబు
నెమ్మిగనజాల రెవరునునీజంబు
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపుర విఠలేశ పాండురంగ॥ 8

సీ॥ క్షీరాబ్ధిశయనరాజీవసన్నిభనేత్ర ననదవానలసుజన వారస్తోత్ర
రాజరాజేశ్వరరంజితామలగాత్ర। వివిధపండితకవివినుతపాత్ర
త్రిభువనాధారగౌరీవంద్యచారిత్ర। సత్యవ్రతాచారస్వర్ణనేత్ర
కఠినశాత్రవగర్వఖండనకరపత్ర। భక్తజానానందభానుగోత్ర
గీ॥ పాకరిపుభోగభోవు రమాకళత్ర
దానజనసంఘు కలుషలతాలవిత్ర
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ॥
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 9

సీ॥ పాలసంద్రమె నీకు పరికింపఁగా యిల్లు - జలజాక్ష నా పాపములను గిల్లు
గొప్పగా నీకతల్ తప్పక రాజిల్లు విరచితవౌ నాఁకుహాయుని యిల్లు
సిన్నుఁదల్వని వారి వున్నత మహాపెల్లు పరికింపఁగను పాఁడుఁబడిన కొల్లు
నీ యన్నద్రాగెను నేసైన రుచికల్లుఁబడదన్నితివి ముందుబండిఁగల్లు
గీ॥ శ్రీకరంబగు సిరులివ్వ నీకె చెల్లు -
దనుజవర్గంబు నిర్గ్గని తల్లడిల్లు -
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 10

సీ॥ అల్లరిఁబడితివి గొల్లచెలులవల్ల - కణగి నేలితివి లోకముల నెల్ల
నీలాబ్రమును గేరుని శరీరంబెల్ల చాలప్రబలితి జేజేలవల్ల
సేవించితిని నాదు చిత్తమురంజిల్లఁ బాపవె నాదు పాపముల నెల్ల
నిఖల బ్రహ్మాండంబు నిండెను నీడొల్ల తరిగితౌ పగతులతలలుదుల్ల
గీ॥ చక్రఁగా బ్రోవు నా మది సంతసిల్ల -
దనుజులెరుగరె నీదు వృద్ధిఁడమెల్ల
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 11

సీ॥ అస్థిరంబని దేహమది దెల్యనేరక మంచిగా నిను స్మరియింపలేక
పాపకార్యంబులఁ బహుపోగు జేసుక పత్నీసుతులయందు భ్రమవదలక
నిర్వికారుండని నిన్ను నెరుంగక - కడతేరుటెట్లు దుర్గతినిబడక
శాశ్వితంబైనట్టి స్వర్గంబుఁబడయక నిర్నిమిత్తంబుగ నీ లైదరిక
గీ॥ పాలబడితిని నేలు భూపాలతిలక -
నేర మెన్నకు నాపైన మారజనక
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ॥
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 12

సీ॥ సూరిజనహృదయసారసదళమిత్ర। సుందరానన యరవింద నేత్ర
సారససంభవ శంకరాదిస్తోత్ర । నిఖిల లోకాధారనీలగాత్ర
పండరీపురవాస భండనరిపుజైత్ర । తవభక్త పాప లతాలవిత్ర
ఖండన శివచాప ఖరకరసద్గోత్ర । పాకారివందిత భూకళత్ర
గీ॥ రమ్యచారిత్ర దశరధరాజపుత్ర
మనవిచేకొని నన్నేలు కనక నేత్ర ।
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 13

సీ। తవనామమధుర సుధారసంబును । గ్రోలిసంతసించితిభక్తజనులపాలి
దేవుఁడవనుచు నుతించితి వనమాలి । భక్తుడంచును జెందఁబడవుజాలి
వనదశరీరి నీవాఁడి ముల్కినఁగూలి। నిష్ఠురోక్తులుఁబల్కి నిన్ను వాలి
బాలుడంచునువచ్చిఁబడినీగ్రైపెనుగాలి ।తనయుడైనుతి కెక్కితమ్మిమాలి
గీ॥ పద్యములుఁజెప్పితిని నేనుపనికిమాలి
దయనుఁజూఁడుముమరువకధర్మశాలి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 14

సీ॥ కలకాలమిట్టుల కష్టముల్ బడజాల । మన్నించునన్ను భర్మాభజేల
వైరివర్గాట వివహిన్నవిగోపాల । పరిధిత సద్విభుధాళి భావలోల
కరుణాంతరంగ శ్రీ కాకుత్స్థకులసీల । గానధురీణ దాసానుకూల
మానితాచార శ్రీ మంజులవాగ్జాల । వందితాఖిలకృష్ణనంద బాల
గీ॥ పండరీపురనిలయ వేదండపాల
సచ్చిదానందదయఁజూపు జాగులేల
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 15

సీ॥ వలనొప్పఁగట్టితౌ వారాసిలోరోడ్డు । నెరివాలిబెట్టెను నీకుసొడ్డు
నిఖిలజగంబుల నిర్మించెనీబొడ్డు । తవకుమారుఁడు దేవతలకు హేడ్డు
బాయనునీభక్తిఁజేయక యేహడ్డు । రహినిన్నుఁదల్వ విరసన తెడ్డు
పన్నుగానిచుఁదల్వకున్న నరుఁడొకగొడ్డు। పాపకూపంబులోఁబడితివడ్డు

గీ॥ తిన్నఁగాఁజేర్చుకుంటివి వెన్నజిడ్డు
మ్రింగితివిముందువిమరుఁడేమిచ్చెనుడ్డు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 16

సీ॥ నిగమార్గసంచారనిఖిలభక్తాధార । నిర్జరానందశ్రీనిర్విచార
కంజాతనేత్రనిర్గాంచితిఁకనులార । బుధజనావనదశరథకుమార
భూపాలపాలనిర్నూపజింతు మనసార । కడుశుభంబులనిచ్చిగావవేర
కరిరాజరక్ష శ్రీకరభక్తమందార । శ్రీ రమాహృదయరాజీవసూర

గీ॥ మనవిచేకొను రాక్షసమదవిదార
పరమపావన పండరిపురవిహార
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 17

సీ॥ స్మరనవరూప భాసురభక్తమందార । దేవకీతనయ యశోవిహార
వాగ్దేవిశైలజా వర్ణితయాచార । లాలిత్యవంత నీలాభ్రకార
పాపాబ్ధి సందోహ పవనసత్యవిచార । శ్రీరుక్మిణీమణిచిత్తచోర
లోకత్రయంబులరూఢిగామనసార। రక్షించితివిదశరథకుమార

గీ॥ వనజలోచన శతృకాననకుఠార
ఆదరింపుముదేవ మాయాక్షమార
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 18

సీ॥ కరమందునీవుచక్రాయుధంబు । ధరించిబలసినరిపుకోటితలలుద్రుంచి
భావంబునలరసుగ్రీవునిరక్షించి । అలయింద్రజునిప్రాణమపహరించి
వనచరాళినిఁగూర్చి వారధిబంధించి । ఘనతలంకాపురికనులఁగాంచి
కిన్కఁబూనియుదశగ్రీవునివధియించి । చింతనువిడనాడి సంతసించి
గీ॥ సీతతోఁడనయోధ్యకుఁజేరిమించి
కరుణతోఁడను నేలునికనులఁగాంచి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 19

సీ॥ భవసాగరంబునఁబడియీద నేరక । స్తుతియించినాడ దుర్మతినిగనక
నిర్భాగ్యుఁడేదూరునీమహత్తెరుగకఁ । దప్పునశమనునిఁదాపుజనక
వినుతించితినినాదుమనసునొప్పింపక । పాలించుమయ్యభూపాలతిలక
మనువంశమునబుట్టితనుచుగర్వించక । మోహనాకార నేముద్దుగులుక
గీ॥ శతకమొక్కటివ్రాసితి శ్రమనుఁబడక
మరచిపోకనునన్నేలు మదనజనక
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 20

సీ॥ నిరుకుగా నీయింతి నిలయమే పద్మంబు । కఠినులజంపెనీఘనశరంబు
దశరథక్ష్మాపాలతనయ నీధామంబు । పుడమిదీనులకెల్ల కదుధనంబు
పోలుపుగా నీచతుర్భుజముల సత్వంబు । ఎరుగకనిల్లిరి యరిగణంబు
నీపాదములయందు నిల్పినేచిత్తంబు । దప్పకఁజేతు సత్యవ్రతంబు
గీ॥ నిక్కముగనన్నుబ్రోచుటే నీనిజంబు
అరయనీచర్య లెన్నయత్యద్భుతంబు
విదిత కొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 21

శా॥ భువిమోహానాకారపుండరీకదళాక్ష । దయతోడనాకిమ్ముధర్మభిక్ష
పరిపంథులనుజంపబట్టితివటదీక్ష । ఖ్యాతిగాంచిన ధర్మసూతిపక్ష
కురువంశమంతయుఁగూలార్చుటకు కక్షనీనితివలనాడుభువనరక్ష
స్థిరముగాపద్యముల్ జేసియువకలక్ష । కృతినిత్తునీపేరకృపనుమోక్ష
గీ॥ పదవినొసగుము సత్వరకదనదక్ష
అవ్యయానంద శ్రీకరుణాకటాక్ష
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 22

సీ॥ కొమరొప్పపద్యముల్ గూర్చియు।పూదండవలెవేతువేగనీగళమునిండ
నీకుమారుండెన్నలోకంబులకు। గుండకరుణతోఁజూడుమనీకనులనిండ
దశవేషములచేత దనరినమార్తాండ । వంశప్రతాప సద్వాక్యశౌండ
సిరులిత్తువనినేనుఁజేరితినీయండ। రమణతోనిమఖగరాజకాండ
గీ॥ కమల జాండోదరుడవులోకములునిండఁ
జెప్పచుందురుపండితుల్ దప్పకుండ
విదిత కొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 23

సీ॥ గోవర్ధనోద్ధితకుండలీశయన । కఠినరాక్షసవారగర్వశమన
వర్ణితనిర్జరవారణేందావ్రన । రంజితామలకాయకంజనయన
భానుసంకాశసత్పక్షిరాడ్వాహన।యిందిరాహృదయారవిందసదన
భవముఖామరనుత పాలితమునిజన । పాపసందోహాబ్రిపవనసుమన
గీ॥ మణిగణాలంకృతాహార మధురవచన
సాంద్రసదృశ పూర్ణిమచంద్రవదన
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 24

సీ॥ బ్రిస్తుతించితినని వరములిప్పవు నాకు ♦ చెండాడెరిప్పులనీ చేతిబాకు
గొల్లభామల చీరలెల్లనెత్తుకమోరకు ♦ పైనగూర్చుండుట పనువనికు
నీరజాక్షులముంచె నిపుడ జేసినపోకు ♦ యిపుడునన్నేలక యెందుబోకు
ఘనసమమూర్తింత కఠినిమూనిగబోకు ♦ లేదువేల్పులకునునీదుఠీకు
గీ॥ దనుజమర్దన నన్ను నీదయనుసాకు
నాకుజాతుడు కృతినిచ్చె నారనీకు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరీపురవిరలేశ పాండురంగ॥ 25

సీ॥ శేషశాయివటంచు భూషించితిని ప్రీతి ♦ గానన్ను నేలినగల్గుఖ్యాతి
కల్పశాఖనిమించె గనుగొననీసాటి ♦ మెప్పుగాగోరెనిక చుప్పనాతి
ధర్మవర్తనుడనిదలతురు మునిజాతి ♦ నీపదంబునగల్గెనింగినాతి
పరిపంధిజనులకుభయమునీ చే హేతి♦ వాహ్వానమ్మినబంటువాయుసూతి
గీ॥ మొక్కిమొక్కియు యింతకుమోసపోతి
యెట్టులనుదూరిననుగాని యేలనైతి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 26

సీ॥ కారుణ్యశరధి నిష్కామ బంగరుచేల ♦ సారసనయనదాసానుకూల
సంతతసజ్జన సాధుసజ్జనజాల ♦ గోపాలకృష్ణ సద్గోత్రశీల
దుర్మార్గవైరి సందోహబ్రివాతూల ♦ పారిజాతశౌర్య గుణాలవాల
యాహావపుజనాంతర్గత యాభీల ♦ క్షితిగోపికలకు జూపితివిలీల
గీ॥ కోరినీపేర పద్యముల్ కుసుమమాల
గారచించితినన్నేలు గానలోల
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ। 27

సీ॥ తనువునిత్యంబనిధనముసంపాదించి ♦ దానముశాంతము త్యజించి
పెద్దలగురువుల ప్రియము చేనిందించి ♦ ఎలమిబీదలఁగనిమెక్కిరించి
తల్లిదండ్రులపైన తప్పులుగావించి ♦ అన్యులధనమెల్ల నపహరించి
దుర్మార్గులనుఁజేరిదుడ్కులుగావించి ♦ చెడుకార్యములయందుచిత్తముంచి
గీ॥ కడకునరకంబుననుఁబడి కడుకృశించి
సద్గతిఁ జెందరైరి వీరి సంస్మరించి
విదిత కొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 28

సీ॥ పరమేశసాంగత్య పరికింపనీమాట ♦ అసదృశంబైనట్టి పసిడిమూట
కన్నతండ్రివటంచుకొన్నదముప్పూట ♦ లోకమందెవ్వరునీకుపూట
నిశ్చలభక్తిచే నీమాటజవదాట ♦ నెరినాకువరమివ్వ నీకులోట
సినధూమణిఁజూడనిల్వదుమెచ్చోట ♦ మునుకొనినీస్తుతేముక్తిబాట
గీ॥ వేడుకలరఁగ నేసత్కవీంద్రునోట
మానజాలను సతమునీపైని పాట
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 29

సీ॥ రాజరాజేశ్వర రమణీయతరవేష ♦ శోభనాకార సత్యాభిలాష
భానుసంకాశసత్ఫణిరాజసమభాష ♦ ఇందిరాహృదయారవిందపూష
నారదవిబుధవనాటాదిసంతోష ♦ వందితామర మదవైరిశోష
సంతతానంద యనంతరత్న విభూష ♦ సింధుగంభీర భాసితమనీష
గీ॥ పార్వతీసుతచారిత్రి నిఃశేష
చిత్రభానుకులోద్భవ సింహరోష
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 30

సీ॥ మనవిఁ జేకొనుమయ్య దినమణిసమతేజ ♦ వరముని సేవితపదసరోజ
సుజనసంరక్షణ సుందరరతిరాజ ♦ కవిబుధసంచయ కల్పభూజ
వనజాయతాక్ష సద్వైభవసురరాజ ♦ స్థిరయశఃకామ లక్ష్మీమనోజ
పరమభక్తిఁగఁ జేతు మరువక నీపూజ ♦ రంజితసద్ధనరాజరాజ
గీ॥ ధీజనానందవరద మత్తేభరాజ
సుగుణవందిత సంతత సురసమాజ
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 31

సీ॥ కనకాద్రిసమధీర కనుఁగొననీవంటి ♦ వేల్పు లేడనుచు నే వేడుచుంటి
పటుబలసాహస ప్రౌఢికిముక్కంటి ♦ సరిరాడనన్నని సాకుమంటి
కమనీయగాత్రనీ కారుణ్యరసమంటి ♦ పరమందరేబుధులరయు కొంటి
ధన్యుఁ జేయుమీదయకు పాత్రుడనంటి♦వినుతించివినుతించివిసుకుచుంటి
గీ॥ మానవాధిప కుత్సితమతినటంటి
వేడ్కనీపాదములుఁబట్టి విడువనంటి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 81

సీ॥ సనకసనందన సంస్తవపదజాల ♦ శోభనాకార భగ్నాభచేల
చారణ కిన్నరాశ్చర్య సువాగ్జాల ♦ గానధురీణ బుధానుకూల
సామజరాట్పోష జనకజహృల్లోల ♦ మణిమయహార సమంజసీల
భాస్కరసమధామ భండనరిపుకాల ♦ పతకరాడ్గట్టిలానిభావఖేల
గీ॥ దేవదేవేశ శ్రీశయశోవిశాల
రహిఁగొనంగదె గొను పద్యరత్నమాల
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 30

సీ॥ నీదివ్యరూపంబు నేకన్నులనుజూతు ♦ నీపైనపద్యముల్ నేనువ్రాతు
సంసారభ్రమయనిస్సంశయంబుగరోతు ♦ చెలగినీకృపకు నేచేయిజాతు
నీపాదుకలుతలన్ మోపుచక్కఁగమోతు ♦ నాపాపపుంజముల్ నఱకివైతు
దయతోననన్నావవెందాకననునేనైతు ♦ నిన్నుఁదలవనివాఁడుదున్నపోతు
గీ॥ నరకమునకంపకోహరి నాకుభీతు
యిందిరానాథ నాతప్పులెందుదాతు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపుర విఠలేశపాండురంగ॥ 31

సీ॥ కలుపాంధ భాస్కర గనుగొననీధాక ♦ కదిరిరిదనుజులు యాగలేక
బ్రిస్తుతించెద జనపాలకశుశ్లోక ♦ పాలించుటకునీకు బహుపరాక
ఎరిగింపుదేవుఁడుయెవ్వరోనీవుగాక ♦ పురుషోత్తముడవీవుపుణ్యలోక
చుట్టంబులానీకుచూడవేల్పులమూక ♦ ఇకరమ్మునన్నేలుఎందుబోక
గీ॥ భండనంబున పగతులు పారిపోక
నిలచెదరెచూడ గనుఁగొంచు నీదుగాక
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 32

సీ॥ వైకుంఠవాసని వాహానంబేపక్కి ♦ యసురులుపుడిసిరియనిలొసొక్కి
శబరియుంగిలిష్లుంతసంబున మెక్కి ♦ కరుణించి నెగడ వెఘునతదక్కి
జఘురామనామదిభయదాటవినిజిక్కి ♦ కడుదలంచితిగానికరుణుశిక్కి
యనువందగనుపెండ్లియాడెనొగనలక్కి ఖరదూషణాదులుగ్రతనునొక్కి
గీ॥ కదననమున నీతోఁ బోరిరక్తంబుగ్రక్కిఁ
జావరేముందుపగతులుచాలపొక్కి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశపాండురంగ॥ 33

సీ॥ పలుమారునిన్ను నేప్రార్థింతుదశవేష ♦ పావననామశుభాభిలాష
సూర్యవంశాకర సూనృతజనతోష ♦ ఇంద్రవందిత శ్రీకరింద్రపోష
పంతమానసుబోధవ్యాళరాడ్వ్యాఘ్రాభష♦కమలాలయాచిత్తకమలపూష
ధనదసఖాసఖ నవరత్నభూషణ ♦ పటుఖలజనవారిత ప్రాణశోష
గీ॥ ద్వారకావాస యచ్యుత తల్పశేష
బీదవాడను నాలింపు నాదుఘోష
విదితకొల్లివి దెయ్య సద్భ్రుదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 37

సీ॥ దానవకులమును దప్పకహరియింప ♦ లలిగల్గితివి పెద్దలభినుతింప
మట్టిలోఁగల్పనామలమూర్తిములకొంప♦నేర్పైతివిగదాని నుస్మరింప
కడలియిల్లుగనుండగా నీకుయుదిసొంప ♦ భక్తులునీకయి పరితపింప
ప్రియబంటుకుంగరంబిచ్చిలంకకుఁబంప ♦ జనినోసంగెనుసీతసంతసింప
గీ॥ త్వరగ రావయ్య నాపైన దయనుసంప
విమలమతితోడ నాదుపాపములద్రుంప
విదితకొల్లివి దెయ్య సద్భ్రుదయసంగ
పండరిపురవిఠలేశ పాండురంగ॥ 38

సీ॥ కాలయాపనమేల కడతేర్చుభూపాల ♦ పాలించుమయ్యశ్రీభర్మచేల
ఘనవేల్పుడననినుఁగనుఁగొనిమునిజాల♦మునుమోక్షమంద రెగుణవిశాల
పరమపావనసత్యభామ హృదిల్లోల ♦ నళినాప్తశశినేత్ర నందబాల
తిలకిలపదాల్చితౌతులసిపూసలమాల ♦ నన్నేలుమయ్యభూనాధసీల
గీ॥ పదియునాలుగు యేడులు పర్ణశాల
నుండిజంపితివౌ లేడినొక్కకోల
విదితకొల్లివి దెయ్య సద్భ్రుదయసంగ
పండరీపురివిఠలేశ పాండురంగ॥ 39

సీ॥ సకలజీవులయందుసాక్షిభూతుఁడ ♦ వీవెయఖిలశాస్త్రంబులయందునీవె
ఆలగాచితివి భూపాలులెన్నగనీవె ♦ సుఖములొసంగు కృష్ణుండవీవె
దనుజులఁబరిమార్పఁదగినదేవుఁడవీవె ♦ కరిరాజునేలినదొరవునీవె
రహియర్జుననకునురథసారథివినీవె ♦ కురుసంతతికి చీడపురుగునీవె
గీ॥ భక్తజనులను రక్షింప ప్రభుడవీవె
ధాత్రికును తండ్రివైన భూధవుడవీవె
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 40

సీ॥ శరణుశరణనినిన్నుస్మరణజేతుఖరాంత ♦ వివిధబుధాళిసద్వదితశాంత
దుర్భరదుర్గుణకర్బురగణహాంత ♦ భక్తాళిపాలిత భవ్యస్వాంత
గానకానినిన్ను నేనోరితి నాకకాంత ♦ కారుణ్యశరధినిష్కామసుంత
కరుణఁజూపుము నైరిగణవారికల్పాంత ♦ నళినాక్ష బాపుమునాదువంత
గీ॥ శ్రీరమాలోల నన్ను రక్షించుమెంత
మోదమలరఁగఁజేరితి నీదుచంత
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 41

సీ॥ నిబిడాంధకారార్క నిర్మలగుణధామ ♦ అసమానశౌర్యరాక్షసవిరామ
ప్రస్తుతభార్గవిభామాంచితఃకామ ♦ ఆగమధర సుజనాభిరామ
కామసదృశరూపకమలాప్తసమధామ ♦ పాపభూధరపవిప్రథితనామ
దశముఖవధజగద్బంధుసత్కులసీమ ♦ కదనవైరికదంబహృదయభీమ
గీ॥ పార్వతీనుతచారిత్ర సార్వభౌమ
చక్కగానిన్నువరియించె సత్యభామ
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 42

సీ॥ నీలనీరదగాత్ర నిర్జరమునిసంగ ♦ పాపవిర్జిత శివచాపభంగ
భాస్వరశుభధనుర్భావాది ప్రసంగ ♦ సంతతానందసుస్వాంతరంగ
బంగరుమయచేలభవతిమిరపతంగ ♦ కదనశత్రుసమూహమదవిభంగ
వివిధకాననచర విదళితసారంగ ♦ మానిత నారితనయానుషంగ

గీ॥ దేహియని వేడినాడను మోహనాంగ
హితవుగానన్ను నేలుము మతిఁ జలంగ
విదిత కొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 43

సీ॥ సుందరాకార శ్రీసూనృతజనరక్ష ♦ నందనందనకరుణాకటాక్ష
ఖండితశివచాప పండితజనపక్ష ♦ వందితామర ఖలవైరిదక్ష
దీనార్థికవులపైఁ బూనకుబల్కక్ష ♦ తారహారాసర సీరుహాక్ష
నార్యులపోషింతు నని బూనితౌదీక్ష ♦ పక్షికిచ్చితివిమునుపరమమోక్ష

గీ॥ మునుఖలాత్ములఁ జేసితిభూరిశిక్ష
చెడితినీపైన పద్యముల్ జేసి లక్ష
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 44

సీ॥ మణిగణాలంకృత మంజులవాగ్భూష ♦ చతురాననాదిత్యహితమనీష
సురనదీజనక భాసురవరతరవేష ♦ కుటిలమానసదైత్య కులవినాశ
శ్రీరుక్మిణీమణీ చిత్తసారసపూష ♦ అమలమౌక్తికమణి హారభూష
కదళినిచేములిడి-గనిపెట్టె పెనుఘోష ♦ దర్పకారాతి నుతాభిలాష

గీ॥ నయగుణోద్దామ భవహరశయనశేష
సదమలాచార మునిజన హృదయతోష
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 45

సీ॥ సుతుడై యియ్యజన్మించెహితవుగాపరమేష్టి ♦ నెరిజేసెనౌచరాచరులసృష్టి
సద్భక్తవరులతో సల్పుచునువటగోష్టి ♦ నిర్జరులందు నేనీదుదృష్టి
ఎంచఁగా నీహితుండైత్రైను కడుముష్టి ♦ భక్తులునీదల్వ బడరునష్టి
నినునమ్మినట్టియాజనులకనావృష్టి ♦ దనుజాళికినినీకు తగినయష్టి
గీ॥ దివ్యరూపంబు విడిదాల్చితివిగఘృష్టి
వాసిగానిన్ను దలచినవాడెకృష్టి
విదితకొల్లివిదెయ్యు సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 46

సీ॥ పరమాత్మనీపైనవిరచింతుపద్యాలు ♦ విరివిగాసిరులివ్వ వేనవేలు
గైరికామహిమగు గప్పితివౌనేలు ♦ కోరెనీ స్త్రీలు పదారువేలు
లంచమిచ్చిరెభక్తులెంచఁగానువరాలు ♦ కడతేరలేదెనీగనికుచేలు
పురుషోత్తముండవనిఁబొగడితివన్నేలు ♦ నీపదంబునగల్గెనింగిజాలు
గీ॥ నిక్కముగజంపెపగితుల నీదువాలు
నెమ్మితలపోయ లక్షలు నీగుణాలు
విదితకొల్లివిదెయ్యు సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 47

॥ వసుధనీకునుబంట్లువానరమూకలు ♦ నరికితౌరా రావణాసురనితలలు
తంపగానీసహోదరులుమిక్కిలిబలు ♦ లరయనిన్నెదిరిరియసురపసులు
జలజనాభుండనిఁదలతురువిబుధులు ♦ మోదమిచ్చునుగదానీదుకథలు
భావింపసుధయనఁబడునీదుపల్కులు ♦ నీస్వరూపముచేతనెగడెసిలలు
గీ॥ పరగగోయుమునాకున్న పాపలతలు
నళినలోచన యికదీరు నాదువెతలు
విదితకొల్లివిదెయ్యు సద్హృదయసంగ॥
పండరీపురవిరలేశ పాండురంగ॥ 48

సీ॥ నీబొడ్డుననుఁ గల్గెనిర్మలంబుగ వేధ ♦ వరియించె నినుఁ గనివరలు రాధ
కౌంతేయునకు మేలుగల్గెనీసదోబోధ ♦ నళినాప్తగోత్ర గుణ విమేధ
నిన్ను మరచినవారికెన్నఁగా బలు బాధ ♦ గోటితో జిమ్మునాకున్న బాధ
పుణ్యనంతుఁడవంచుఁబొగడితిన్ నృపనాథ ♦ ఆగమాధరసుజనావరోధ
గీ॥ అతులితానందశ్రీహరి జితవిరాధ
క్రమతరభావ రాక్షసగణవిరోధ
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరీపురవిరలేశ పాండురంగ॥ 49

సీ॥ కడలిగంభీర శ్రీకందర్పనవరూప ♦ మునిజనమానసామోదదీప
శంకరనుతరిపుజన్యకాండవిలాప ♦ శ్రీగాబ్ధిశయనమృగేంద్రకోప
యినశశినయనపావనకరహారరోప ♦ రాజీవనయననిరస్తపాప
బాషాపతిస్తోత్ర భాస్కరకులభూప ♦ దానప్రవీణసత్యానులాప
గీ॥ ప్రథితసద్భక్తపోష సూర్యప్రతాప
తప్పులన్నియు నీతోడఁ జెప్పనోప
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 50

సీ॥ ఖరకరసంశసాగర శశిగిరిధీర ♦ గజరాజుభక్తాది కలుషదూర
భజియింతునిన్ను నేభక్తితో మనసార ♦ విబుధవందితసదాద్రికుమార
కఠినమానసదశకంఠగర్వవిదార ♦ భూపాలమౌళిబుధోపకార
వరబుధసంచయవర్ణితరాచార ♦ పావనాకారపాపాంధసూర
గీ॥ నమ్మియుంటిని బ్రోవవున్నాయ్యమేర
భూరిమయు చేల పండరీపురవిహార
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 51

సీ॥ తమసభాస్కరనీమతప్పకపదయుగ ♦ ములనుపూజించెదసలలితముగ
కరినుడించుమనుమదిఁగానకుంటివిపురగ ♦ పతిశయ్యానమ్మితిపతఁగతురఁగ
దేవుడెవ్వగునీవెభావించిచూడఁగ ♦ అనువందమోక్షముకంపుత్వంగ
కాలకంఠునియిల్లు ఖండించితివడగ ♦ వరములిచ్చిన నీకువాసితరుగ

గీ॥ స్వామినీనుదల్తు నావాపసమితిఁదోలుగ
యింతశ్రద్ధయుడించు నేడెన్న డెరుగ
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 52

సీ॥ యిందిరాదేవిపక్షిష్టపూయిల్లాలు ♦ కోరిద్రావితివీవు గొల్లపాలు
నీవుదేవుడవంచు నెరనమ్మ జేజేలు ♦ కడతేర లేదనగ్ గరుణనేలు
యెలమియేభక్తులుయిచ్చిరిలంచాలు ♦ మంచిగాదృంచునాసంచితాలు
స్థిరముగానీయన్న చేపట్టినాగేలు ♦ మహినీను పల్కులు మధురసాలు

గీ॥ అమలరత్నమయంబటతమురిహాలు
నెలత నటుఁజంపిజెందితౌనిందపాలు
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరిపురవిరలేశ పాండురంగ॥ 53

సీ॥ రమణీయమైనసఁరాను డగోవింద ♦ బెట్టినస్త్రాజత్తువట్టెసింద
కనజాలునేసినుకధలసారముపంద ♦ మురహారదలతునేమోక్షమండ
మంచిగాలెక్కకుమించినావులమంద ♦ గాచితివటవిఃతఘునులుజెంద
చిత్తశుద్ధిగనేనుఁ జేసితియొకవంద ♦ సీసపద్యంబులు గాసిఁజెంద

గీ॥ వేరుసేయకనన్నేలు విశ్వతుంద
భావజాకార నినునమ్మిభవముజెంద
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపుర విరలేశ పాండురంగ॥ 54

సీ॥ నైరితివ్రాతకానన దగ్ధసుచిన్గిర ♦ తాపస విభుధ పరోపకార
కణ్వకశ్యప యత్రిగార్గేయ సత్ప్రాచర ♦ భరద్వాజసంస్మరవిచార
కుమతులౌపగతులం గూల్చెనీశరధార ♦ వింటరానికథల్ వీనులార
భోగీంద్రశయనని బాగడుదుపాలుపార ♦ శ్రీహరినన్నురక్షింపవేర
గీ॥ నిర్మలాబగు కృతిఁజేతునీదుపేర
శ్రితజనానంద రుక్మిణీచిత్తచోర
విదితకొల్లివిదెయ్య సద్భావదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 55

సీ॥ సర్వోత్కృష్టుడవని స్మరియింపగావచ్చు ♦ గానసీదయ నెన్నగానుతచ్చు
నినునుతించినవారినేభక్తులనవచ్చు ♦ తిలకింపనీసేవఫలితమిచ్చు
పార్వతీదేవినీపసమిక్కిలిమెచ్చు ♦ కమలాక్షుసన్నేలు ఘనతవచ్చు
కడగినీబంటులంకకుబెట్టుకాచ్చిచ్చు ♦ నిఖిలదేవతలలో నివె హెచ్చు
గీ॥ పన్నుగానీకు యీకృతివన్నెతెచ్చు
స్త్రీలుపురుషులు నీసేవఁజేయవచ్చు
విదిత కొల్లివిదెయ్య సద్భావదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 56

సీ॥ నీబుద్ధినైబలిసిబల్ల్వంచిదేవేంద్రున ♦ కునుఃరాజ్యమిచ్చినవనజనయన
నరహరినైహిరణ్యాక్షునిఁగూల్చిన ♦ పరమాత్ముడనుచునుపండితులన
విసియుంటెసన్నేలుఃవిబుధజనావన ♦ మరువకఁగాచితౌమానిసవన
ధారుణిశిశుపాలదంతవక్త్రులప్రాణమపహరించిన ♦ కృష్ణుడనుచునుదిన
గీ॥ దలచితినియువ్వసిరులుయీతక్షణమున
కఠినమూనంగ ధర్మయూ గరుడగమన
విదితకొల్లివిదెయ్య సద్భావదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 57

సీ॥ గాధిజసవనంబుఁ గాచినావటముందు ♦ నన్ను రక్షించుట న్యాయ్యమందు
పాలుపొంద భక్తులఁ బ్రోచినావనివిందు ♦ దానరాధేయ నీదయను గందు
శరణాగతత్రాణబిరుదు నీకుపసందు ♦ యీగ దేమఖుడు నీభోగమందు
కందర్పజనక నన్నాదవు యేమందు ♦ నేనైనసత్కీర్తి నిన్నుఁ బొందు

గీ॥ ధరణిలో పలనీదాస దాసులందు
కఠినమూనగ యములోకగతిని గందు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 58

సీ॥ హరుశరాసనమును యవలీలగా ద్రుంచి సీతను పెండ్లాడి సిరివహించి
రహిమీరగను పర్శురాముని నొప్పించి ♦ పూర్తిగా దిక్కుల కీర్తిగాంచి
వొప్పుగా త్వరగ నయోధ్యకు నేతెంచి ♦ జనకాజ్ఞ తాసిర్సావహించి
కైకవరంబును గని మదిచింతించి ♦ భయదాటవికి నేగి బలుచరించి

గీ॥ అట్టి శ్రీరామచంద్ర నన్నాదరించి
కరుణతో మోక్షమిమ్మ నీకనులగాంచి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 59

సీ॥ మించిరక్కసులను ద్రుంచెనీ చేవాలు ♦ నెరసయోధ్యాపురి నీకు ప్రోలు
దనరసౌమిత్రుఁడు దాల్చెను పురిలితోలు ♦ భయదాటవిని బత్తి దయను గ్రోలు
పుడమిజా నీకును బోసెను తలఁబ్రాలు ♦ పన్నగాధిపశాయి నన్ను యేలు
వాలాయముగ నీవు దోలు నా పాపాలు ♦ కమలాక్షునిన్ దల్వగల్గు శ్రీలు

గీ॥ మోదమొసఁగును జనులకు నీమురియాలు
భక్తిమరువను నీదగు బాసవాలు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 60

సీ॥ సారసనేత్ర నీసద్భక్తులకుముక్తి ♦ పరిపంధులెరుగునీ బాహుశక్తి
కురురాజెరుంగడు క్రూరమాసీయుక్తి ♦ నిరతంబుమరువనునీమాభక్తి
పరమపావననామ బల్కకుశతినోక్తి ♦ నేరతాదిత్యులు నీదుసూక్తి
శరణాగతత్రాణ బిరుదనిలోకోక్తి ♦ గలనునీకథలెన్న గానరక్తి
గీ॥ త్వరగదాసుల నేలుటే తగినశక్తి
శ్రీకరంబుగ నీస్తుతే నాకుభుక్తి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 61

సీ॥ సుగ్రీవునకు రాజ్యసుఖమిచ్చితివినాఁడు ♦ నీకీర్తిదిక్కుల నిండెనేడు
నిర్భాగ్యుడైనవారైన నిన్నన్నగాబోఁడు ♦ భక్తునినీపైనపాటఁబాఁడు
తలుపఁగాపులితోలుదాల్చెసంగడికాఁడు కమలాక్షనీపూర్ణకన్నులఁజూడు
పోకిరినీకతల్పొందుగావినబోఁడు♦ నారదుండునుతించినాట్యమాఁడు
గీ॥ తొలుత పూజింతు నీదుపాదుకలజోడు
వుబ్బి వరమివ్వకున్న నీయబ్బతోడు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 62

సీ॥ పొంచితివనినిరసించెను నినువాలి ♦ స్తుతియింపదేశబంధుండుగూలి
నినుఁజూచిసాల్వుండువినఁజేసెగాగేలి ♦ సాక్షిరినీవారుసురనుగ్రోలి
తాటకిదునిమినీపాటిమగటిమజోలినినుఁదూలడెసుయోధనుఁడుఁవ్రాలి
కుట్టడంచునుమెత్తుకొనిఁజచ్చెపెనుగాలి♦ చెలగినీమాయలోఁజిక్కెశూలి
గీ॥ భూమిలోలేదు నీవంటి పుణ్యశాలి
వన్నగాంచుము వేగమే నన్ను యేలి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 63

సీ॥ నిను దాకిమడసిరి నిర్జరాహితకోటి ♦ లోకమందెవ్వరు నీకుపోటి
ధర్మాస్పదంబులైదనరెనీవాగ్ధాటి ♦ నిఖిలజనులకుమాతనీవధూటి
సురవైరిమీదనుజూపితివౌధాటి ♦ ఎలమిసత్వమునను నీవసాటి
యిమ్మగాశరము వేగమ్మిరొమ్మునన్నాటి ♦ తన్నుకావదేమున్ని శాటి
గీ॥ పద్యములువ్రాతు నీపదభక్తితోటి
తాపసులకెల్ల నీపేరుధనముపేటి
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 64

సీ॥ సన్నుతించెదనిన్ను సద్గుణౌఖవిరాజ ♦ కరుణించుమనను కవికల్పభూజ
బలవంతుడవునీవుభాస్కరసమతేజ ♦ రహినేలుననుదశరథతనూజ
నీకీర్తిగణుతింతునేనురాజవిరాజ ♦ పాపినిబ్రోవువైభవబిడౌజ
కృష్ణసద్యశజితకృతతారకారాజ ♦ స్మరియింతునిన్నురాక్షసవిరాజ
గీ॥ జేర్చునీదంఘ తుదియుంబ్రభుజితసరోజ
భక్తరక్షణజేతునీపాదపూజ
విదితకొల్లివిధెయ్యా సద్హృదయసంగ
పండరీపుర విరలేశపాండురంగ॥ 65

సీ॥ కౌసల్యగర్భ ముక్తాఫలంబవిపేరు ♦ జేరితి పద్యముల్ జేతునూరు
నీలమేఘముచాయ నిరసించెనీసౌరు ♦ సన్నుతించితినివో స్వామివారు
భక్తితోడుతనునీపాదముల్ పలుమారు ♦ పూజింతురయ్యా జేజేలబారు
స్థిరహేమకశ్యపుం జీల్చెనునీగోరు ♦ నిర్భాగ్యుడెవరైననిన్ను దూరు
గీ॥ ప్రకటితంబుగనన్నుంజేయకుము వేరు
పన్నుగాదైవమెవరు నీకన్న లేరు
విదిత కొల్లివిధెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 66

సీ॥ పదరజంబునుసోకిపాషాణమునునాతి ♦ యయ్యెజెందితివిసీవట్టిఖ్యాతి
జెప్పెజానకివార్త (దప్పకనోకకోతి ♦ మెప్పుగానినుఁగోరెచుప్పనాతి
పరిపంధులకునెల్ల భయమునీచేహేతి ♦ సాధులకునుదెల్పు నీదునీతి
యుంతకకినుడవంచుయేనెరుంగకపోతి ♦ మోదమొసంగుప్రహ్లాదురీతి
గీ॥ యిలనుఁగూలజెనినుమించి యింద్రసూతి
తారుమారైరి నీచేత దనుజజాతి
విదితకోల్లివిదెయ్య సద్భ్రుదయసంగ॥
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 67

సీ॥ కలుషాంధకారభాస్కరనిన్నువర్ణింతు ♦ భవహారనాదుపాపములద్రుంతు
కరుణాసముద్ర(శ్రీ)కరముగనినుగాంతు ♦ తవిలిమోక్షంబివ్వతమరివంతు
సజ్జనాధార నీసాటెవ్వరనియెంతు ♦ నిఖిలచరాచరుల్ నీదుసంతు
మందరాద్రిసుధీర యందాకసైరింతు ♦ బెట్టకునాపైన వట్టిరంతు
గీ॥ వెట్కతోడనువరమివ్వ వేతుగంతు
సార్వభౌముఁడవనుచు నేసంతసింతు
విదితకొల్లివిదెయ్య సద్భ్రుదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 68

సీ॥ నింగిగంగాదేవి నీపాదమునఁబుట్టె ♦ నన్ను రక్షింపకయున్న వట్టె
నీదెబ్బకునునల్గి నెరివాలినినుదిట్టె ♦ భవసమూహితుఁడవై బరగితట్టె
నలుఁడునీకోసమై జలధికట్టగగట్టె ♦ పగతులనీవాలు భంగపెట్టె
వసుధసత్రాజిత్తువాదొక్కటినిఁబెట్టె ♦ నేటుగాగోపెమ్మ రోటగట్టె
గీ॥ ఎలమినీదానమునకీగెయీవిచెట్టె
తలుపనీకీర్తి మహిమదిక్కులనుముట్టె
విదితకొల్లివిదెయ్య సద్భ్రుదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 69

సీ॥ కరమొప్పనీపాదకమలములేప్రొద్దు ♦ రహినిపూజింతుపరాకువద్దు
దశరథాత్మజనాదుతప్పులుతగదిద్దు ♦ పరగనీదల్పనినరుఁడుమొద్దు
కణగినీసంగడికాడెక్కువెల్లెద్దు ♦ తిలకింపనీదల్వఫలముగద్దు
దయమానిపూనితౌదనులపైజిద్దు ♦ కనుఁగొనహరినీదుకథలుముద్దు
గీ॥ గాననీపేరునకు వీరెకథలురద్దు
లోకనాయకనీభక్తి నాకుహద్దు
విదిత కొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 70

సీ॥ వామనావతారనీవర్ణింతునొకసారి ♦ దయతోడనన్నేలుదనుజవైరి
నీస్నేహితుండయ్యెనెగడెనుత్రిపురారి ♦ వందనమిదిగొగోవిందశౌరి
భక్తజనంబులుపలుమారునినుఁగోరి ♦ కడతేరలేదనిక్కముగభూరి
చెలువప్పనీచేతసిరిగాంచెజంభారి ♦ కాపాడుమయ్యపరోపకారి
గీ॥ దశరథాత్మజనీపేరుఁదలచెగౌరి
గట్టిగానీదుపదమునబట్టువారి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశపాండురంగ॥ 71

సీ॥ కరమునీచెలికానికాపురంబేగట్టు ♦ యరివర్గములనునీశరముమట్టు
తరుణియయ్యెనుపాదతాడనంబునచట్టు ♦ భావింపనీదానమీవిచెట్టు
దేవయవ్వరికిని తెలియదునీగుట్టు ♦ ఘనమైనవైకుంఠమునికిపట్టు
బీదవాడనటంచుఁబెట్టకుపైరట్టు ♦ భక్తుండుకడునిన్నుబాధపెట్టు
గీ॥ వాసవార్చితనిన్నెన్నువాడెభట్టు
వరములివకున్నదిట్టెదవట్టుబెట్టు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 72

సీ॥ రాజితంబౌ పాపరాయుడునీపక్క ♦ కదమ వేల్పులకునిక్క-మునగ్రమొక్క
నీనామమధురమే నేరివేతునొక్కగ్రక్క ♦ గాననేదల్వనీకథలుదక్క
హారినిన్నుదల్వనియధమాధముండుకుక్క ♦ నిఖిలదేవతలెల్లనీకు లెక్క
కరిరాజునుకరిచేకడుబాధలనొక్క ♦ గాంచిరక్షించితి ఘనతదక్క

గీ॥ భూరినినునమ్మ యమలోకమునను జిక్క
మనుజుడెవ్వరైన నినుమర్వ తినునె నక్క
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 73

సీ॥ పరమపావననామ పరుడనునేగాను ♦ వేడినీదాసుల గూడినాను
నీలమేఖముచాయ నిరసించెనీమేను ♦ వరమిచ్చుదాకనీ వదలిపోను
పుండరీకదళాక్షుబ్రోవుమునీసూను ♦ డనిమనంబుననన్ను ఘనతతోను
కరుణతోడనునన్ను గాంచినిదయతోను ♦ స్థిరముగానను గావుదీక్షతోను

గీ॥ చిత్తశుద్ధిగ నీపూజఁ జేసెదాను
కఠినుడనకను నాపైనకక్షమాను
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 74

సీ॥ ఘనసింహమై హేమకశ్యపుండనువానిఁ ♦ జంపినాడవుగదా చలమునూని
స్మరియింతునీదగుస్మరణయే భూజాని ♦ తరియించెనిదల్చిత్వరగదాని
కడతేరెనీకృపాకరము చేతభవాని ♦ కృతినందునాపైనకృపనుంబూని
తిలకింపనినునమ్మి గొలచువాడేజ్ఞాని ♦ పరిపంధులెదిరించిపడరెహాని

గీ॥ మేటివేల్పుండవనుచు వాల్మీకమౌని
ప్రేమదమెసగఁగ కృతిఁజేసె పనులుమాని
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 75

సీ॥ సన్నుతించెద నిన్ను సారసదళనేత్ర ♦ మరువక నన్నేలు మాంగళత్ర
దర్పకసముకార దానివకుల జైత్రి ♦ వర్ణితామరవారసద్వర్ణనేత్ర
సూరిజనాధార సుధకరచారిత్ర ♦ తామసగిర్వల తాలపత్ర
శ్రీకంఠవినుత దివాకరసద్గోత్రి ♦ కనకాద్రిసమదృశపవన గాత్ర
గీ॥ రమ్యతరవేష దశరథరాజపుత్ర
విభుధపండితసజ్జన వినుతపాత్ర
విదితకొల్లివిదెయ్యసద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 76

సీ॥ పటుబలశౌర్యశ్రీపాలితసూత్రామ ♦ కంటకాంతక సువైకుంఠధామ
సంగరభీమ మాతంగపోషితనీమ ♦ అంబుజహిత సువంశాబ్ధిసోమ
పరమేశశివచాప భంజనగుణధామ ♦ సంతతానంద యనంతనామ
భువనైత్రియాధార రవికోటిసమధామ ♦ శోభనాకార జనాభిరామ
గీ॥ ప్రాపుఁజేరితి నాపైనఁజూపుప్రేమ
వసుమతీశ్వర దుష్టరాక్షసవిరామ
విదిత కొల్లివిదెయ్యసద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 77

సీ॥ శ్రీసత్యభామ మనోసరసిజఖేల ♦ కర్పూరమయ సత్ప్రకాశ చేల
దుర్మార్గవైరి సందోహభీకరకాల ♦ భక్తసంరక్షణాసక్త సీల
గంగానదీ తరంగాంచితవాగ్జాల ♦ దీనమానవ సమూహానుకూల
దుర్వృజనోత్సంగతూలోరువాతూల ♦ దిగ్వ్యాపితాచ్ఛకీర్తిసుపిశాల
గీ॥ మానితాకార పూజింతు మల్లెపూల
తడవుఁజేసిన నేనింక తాళజాల
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 78

సీ॥ కందర్పసమపురఖలదైత్యకులమార ♦ శ్రీరమాహృదయరాజీవసూర
కుండలీశయనసతోషవిదళితభార ♦ దేవదేవేశయశోవిహార
రణధీరుఁడగుపంక్తిరథునకగ్రకుమార ♦ ఖండలసముభోగకలుషహార
పరగుణాకరరిపువారవన్యకుఠార ♦ మంగళాచారహిమాద్రిధీర
గీ॥ భువనవందితపండరిపురవిహార
సారసేక్షణనన్నేలజాలమేర
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరిపురవిఠలేశపాండురంగ॥ 79

సీ॥ పున్నమచందురుఁబోలునీవదనంబు ♦ పరమాత్మనీస్తుతి భవహరంబు
మంచిగానీకృపనుంచినాపాపంబు ♦ కడద్రోయుటేమంచికనికరంబు
హల్యశాపముబాపెనట్టినీపాదంబు ♦ ఘనపండరీపురికాపురంబు
దశరథాత్మజనాకుదయతోడమోక్షంబుదయసేయుటే నాకుతగుధనంబు
గీ॥ అంబికకు నీదుపేరు కర్ణామృతంబు
ఆశతోఁ జేతు నీసేవ యనుదినంబు
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపుర విఠలేశపాండురంగ॥ 80

సీ॥ నిర్మలంబుగఁబుట్టనీపాదమునగంగ ♦ పాలితామరవారపావనాంగ
శ్రీరమణీమణిచిత్తపద్మపతంగ ♦ దనుజాభ్రపవనసత్యప్రసంగ
కాంచనాంబరసన్నుఁగాపుపక్షితురంగ ♦ భక్తమానీంద్రాదిభవపిభంగ
రమ్యచారిత్రనిరామయశ్రీరంగ ♦ రఘుకులతిలకధర్మానుషంగ
గీ॥ బ్రస్తుతించెదనిన్ను నే భాసిలంగ
వేరుసేయకవరమిప్పు వెన్నదొంగ
విదితకొల్లివిదెయ్యా సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 81

సీ॥ తత్పదంబులు నేనుతలఁదాల్చెద దేవ ♦ భవములుకడద్రోయు వాసుదేవ
భావజాకార నీభజన మోక్షపుత్రోవ ♦ అందివ్వసిరులు మహానుభావ
సంసార బాధలు సమయించుటకు నీవ ♦ బ్రస్తుతింపంగ బిరానరావ
యీతరిబ్రోవకున్నతు నీపైదావ ♦ కరిరాజుఁజూడ నాకన్నలావ
గీ॥ పుణ్యవంతుఁడ నైతివి భువినిదేవ
పన్నగానాదు బాములుఁ బాపలేవ
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపుర విఠలేశ పాండురంగ॥ 82

సీ॥ కైకవరంబున కాననంబునకేగి ♦ విపులరాక్షసులతో వేగివేగి
వాలినిఁజంపితౌవడి బాణమునడాగి ♦ భూతలంబునకునీ తాతత్యాగి
పగరసోదరుఁడునీపదభక్తికినిలోఁగెఁ ♦ జెప్పెమర్మములంక చెడకసాగి
నినునుతించనియెడ్డెమనుజుఁడు కనమూగి ♦ దయనునన్నేలుముతల్పభోగి
గీ॥ ఖరునింజంపెదెనీబాణకడిమితూగి
వనధిబంధన చేసితినేవాగివాగి
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 83

సీ॥ తరణాన్వయాబ్ధిసుధాకర మోక్షమ్ము కరుణచేనొసగుముకడుశుభమ్ము
భవనుతనీదుసద్భక్తి భక్తులసొమ్ము ♦ యీకృతినీకీర్తి కెంతొ నెమ్ము
ఫలముకై పూజింతు తలపనీపాదమ్ము ♦ జగతీశ నాపాపమగజమ్ము
పరమాత్మనీనోటిపల్కేశృంగారమ్ములనియెన్నబడిరిగాయలజనమ్ము
గీ॥ దాశరధిబ్రోవనన్నిటుత్వరగరమ్ము
బ్రస్తుతించిన నీనామ భవహరమ్ము
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ। 84

సీ॥ భూమిజావరనాతోఁ బూనకుయిటుకిక్ష హల్యశాపవిమోచనాయదీక్ష
యినశశినయన పావనకరిసంరక్ష ♦ దివిజారిహరణ కౌంతేయపక్ష
తలపనిపై పద్యములుఁ జేసెదనులక్ష ♦ సాగరశయనవిశాలవక్ష
భక్తాళినుతిసత్ప్రభావ పక్షిముముక్ష ♦ నన్నేలుమిక కరుణాకటాక్ష
గీ॥ సుందరాకార నాపైనఁ జూపవేక్ష
సారదిని న్నెన్నతరమానసారదక్ష
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 85

సీ॥ మన్నించుసత్వరమానితసుపిచార ♦ సేవనేజేతువామ్నావతార
సూనృతకవిబుధసూరిజనాధార ♦ రాజీవనయనకూర్మావతార
బలినిపాతాళానబంధించితివిశూర ♦ దేవాదిదేవకృష్ణావతార
వుగ్రహితాసర్వవిగ్రహసువికార ♦ ధర్మమార్గైకబుద్ధావతార
గీ॥ కమ్రుతరభావశ్రీశకల్క్యవతార
కే:లానందహృదయరామావతార
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 86

సీ॥ చిత్తజరూప నేఁజేరితినీప్రాపు ♦ నెరికన్నులకుఁ జూపుసీదురూపు
పరమేశ నేఁ జేయుపాపములనుఁ బాపు ♦ శ్రీపతినుతియింతు రేపుమాపు
కొంకకసీబల్మికొండలైనను లేపు ♦ నిఖిలపగతులఁ జంపెనీదుతూపు
పరగ నాతలమీద పాదముల్ తగమోపు ♦ కోర్కెదీరఁగమోతుకొంతసేపు
గీ॥ బట్టుకవితోడయెందుకు యిట్టిరాపు
పంతమూనక మోక్షమిప్పట్టుఁ జూపు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 87

సీ॥ యహిరాజతల్పనన్నాదరించుమటంచుఁ బ్రస్తుతించితిని మొరాలకించు
పాలలోచనసఖాభవబంధములుద్రుంచు ♦ కంధిగంభీరనన్నాదరించు
అరయనీకొండుక్కమోహాంబుధిలోముంచు ♦ శ్రీపురుషజాతికిన్ నేపుమించు
ఆకొన్న భక్తులనరలేక పాలించు ♦ నీకీర్తి దిక్కుల నెరిచరించు
గీ॥ మెచ్చిగమియింప రుక్మిణీయిచ్చగించు
కాళిమతియుం చేసి పేరు మేలటంచు
విదితకోల్లిపదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 88

సీ॥ సత్యంబుగానీకుసాగరంబేయిల్లు ♦ మూఁడులోకములనీముద్రజెల్లు
భావింపరుక్మిణీపన్నీరుపైఁజల్లు ♦ రిపులకునీహేతి రేగుముల్లు
నీప్రసంగంబు మోదమైరంజిల్లు ♦ దనుజాళినిర్గనితల్లడిల్లు
నీకతల్ విననట్టినిముని లేకొల్లుఁ ♦ జనదన్నిశీపిము ఠాంబండిగల్లు
గీ॥ పాపఖన్మంఁచు తెల్యాకబహుగిరోల్లు
సీత కైదృంచితివి నాఁడు శిపునియిల్లు
విదితకోల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిరలేశ పాండురంగ॥ 89

సీ॥ యింద్రునకును రాజ్యమిచ్చికొంటివికీర్తి ♦ స్మరించుని న్నెప్డు సాంబమూర్తి
అతివనుఁజంపినావనినీకుయపకీర్తి ♦ రహీవహించితినీపు రామమూర్తి
నీపైనశతకంబు నేనుఁజేసెద పూర్తి నయమొప్పదీర్చుము నామయార్తి
రిక్తుడంచనబోకుభక్తాళివశవర్తి ♦ జలజాక్షురిపుహారచక్రవర్తి
గీ॥ జన్మసాఫల్యముగఁజేయుసరివార్తి
మరువఁజాలనునిన్ను నేమదనమూర్తి
విదితకోల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరీపురవిరలేశ పాండురంగ॥ 90

కడ తేరెదను నమ్మికగ విభీషణు ♦ పతి యుంచితివి నీదు పాదస్మరణ
నీసతిఁ జెరఁ గొనినీ త్రైసైరావణ ♦ యమల వేదాంత విద్యా ప్రసిణ
కరి నేలితివి నాఁడు శరణాగతత్రాణ ♦ బీదలపైఁ జూపు నీదు కరుణ
నీమాయఁ దెలియదు కామారికిని ♦ భ్రూణలోక కో మేధికా నేకభరణ

గీ॥ మించె నీ చూపు సూత సపంచబాణ
యసురులను సిపుజంపితౌ రౌరజాణ
విదిత కొల్లివి దెయ్యసద్హృదయసంగ
పండరీపురవిర లేశ పాండురంగ॥ 91

సీ॥ తిలకింప ఎవరికి తెలియదు నీజాడ ♦ ఖండించితివి నాదు కర్మపీడ
నింగినిఁ దాకును నేర్పుతో నీ ఘోడ ♦ పరమేశ నినుఁ దప్ప పరుల వేఁడ
నీకథల్ గ్గానివి నేకన్నులనుఁ జూడ ♦ నీకీర్తనలుఁ దప్ప నేవిఁ జూడ
నీకు మా యింటెంత లోకంబులకు పోషణ ♦ నాదు చిత్తాబ్జంబు నీదు మేడ

గీ॥ వరములిచ్చియు సన్నేలు వన్నెకాఁడ
యిమ్మగా తండ్రివని నిన్ను నమ్మినాఁడ
విదితకొల్లివి దెయ్య సద్హృదయసంగ
పండరీపురవిర లేశ పాండురంగ॥ 92

సీ॥ లోకంబులను దాచె నీకన్న గర్భంబు ♦ ననుఁ గాంచుమీ దేరు నాతపంబు
జలజాక్షుని పూజసల్పు మననిశంబు ♦ నయముగాఁ బాప వేనాధ యంబు
దరిఁ జేరినాను నిర్ధనుడని కోపంబుఁ ♦ బడక నాకివ్వుము కడు శుభంబు
వటపత్రశయన నీ వాఃక్కు లే యమృతంబు కరమునుంచితివి చక్రాయుధంబు

గీ॥ గట్టిగా బ్రోవు నర్తనక నికరంబు
నమ్మకను నిన్నుఁ జడ రె దానవకులంబు
విదితకొల్లివి దెయ్య సద్హృదయసంగ
పండరీపురవిర లేశ పాండురంగ॥ 93

సీ॥ పరమాత్మ యనుచును బ్రస్తుతించితి నేడు కరుణించవేగ నీకనులఁజూడు
క్షితిపురారాతి నీకితవైన చెలికాఁడు నిర్జరాధిపుఁడు నీకుతోఁడు
నీసుందరమునకు నెమక నెవ్వండేఁడు రాఘవనినుఁదల్వ రాదుకీఁడు
దేవశివధర్మముఁద్రుంచితివలనాఁడు భీకరాటవియయ్యె నీకువీఁడు
గీ॥ తప్పకను గొల్తు నీకు పాదములఁజోఁడు
వసుధనీమిత్రునకు గీము వల్లకాఁడు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపుర విఠలేశ పాండురంగ॥ 94

సీ॥ సేతకైఁగూర్చితె శక్తి నివానరదండు కృపలేకనీ బాఁకు కీపుల చెండు
సిరిఁ జెండెఁజూడనీ చేకపినాథుండు రహినీ లైనినుఁదాకి రావణుండు
నినునుతించని యెడ్డెమనుజుండు గనతుండు సాధిగాగొల్చు మరుత్సుతుండు
చెలువప్పఁ జచ్చని చేలికబంధుండు ప్రభవించె నీవల్ల పద్మజుండు
గీ॥ కణగిమూర్ఖుండు నీని న్నెన్న గానకుండు
మానుగా పాపపిండు నీపైనఁ బండు
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపుర విఠలేశ పాండురంగ॥ 95

సీ॥ శ్రీరమణీమణి చిత్తపద్మదినేశ కుటిలమానస శత్రుకులవినాశ
పక్షిరాడ్వాహన బంభరసమకేశ యాదిత్యలలిత సహస్రకాశ
వందితామరభక్తపాల హృషీకేశ ఖలజనావళిజీవ కాలపాశ
శ్రీకరంబుగ నన్ను చేపట్టులోకేశ పావనమృదుగాత్ర భవవినాశ
గీ॥ ధనము నిమ్మని నిన్నుఁ గోరను దురాశ
త్వరగ నను బ్రోవు శ్రీహరిస్వప్నకాశ
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపుర విఠలేశ పాండురంగ॥ 96

సీ॥ వర్ణింతునిన్ను నేవారాసిగాంభీర్య ♦ శ్రీకరశుభగాత్రసింహశౌర్య
పతియుంచెనీనామపఠననిత్యంబౌర్య ♦ కఠినశాస్త్రవిచారదక్షధుర్య
పలుమారుఁజేతునేభక్తితోఁడసపర్య ♦ రక్షించుమోజగద్రక్షుదార్య
పగరెరుంగరునీదుపటుశరంబులచర్య ♦ నిఖిలసంపదలిమ్మునీకుభార్య
గీ॥ వివిధపండితసత్కవివినుతసూర్య
వానరాధిపవినుతరామానుజార్య
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశ పాండురంగ॥ 97

సీ॥ ఏడుకొండలపైనఎక్కియుఁగూర్చున్నసుఖమునుకొంటివాసుప్రసన్న
అనువందనాస్త్రమాలకించకయున్న ♦ సరివిమోహరగిసియుశంబుసున్న
పరమార్థులెవ్వరుపరికింపనికన్న ♦ ఎవ్వరునుతియింతురింతికన్న
పలుమారునినామ పఠనఁజేయకయున్న ♦ ఎమగాధచేసరుదేడ్చునన్న
గీ॥ రామయననట్టివారలగీమునున్న
ఎలమినినునమ్మి పరమందెయోగ్గున్న
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ॥
పండరిపురవిఠలేశ పాండురంగ॥ 98

సీ॥ కాననసంచయఖలదైత్యకులమార ♦ శ్రీలక్ష్మిహృదయరాజీవసూర
కుండలీశయనసత్కోటివిదతతిభార ♦ దేవదేవేశయశోవిహార
రణధీరుడగుపంక్తిరథునకగ్రకుమార ♦ ఖండలసముభోగకలుషహార
వరగుణాకరశతృవారవన్యకుఠార ♦ మంగళాచారహిమాద్రిధీర
గీ॥ సన్మునీవంద్యవేంకటాచలవిహారి
సారసేక్షణనన్నేలజాలమేర
విదితకొల్లివిదెయ్య సద్హృదయసంగ
పండరీపురవిఠలేశపాండురంగ॥ 99

సీ॥ సర్వేశసతతంబుపర్వతంబేయిల్లు ♦ మూఁడులోకములనీముద్రజెల్లు
భావింపయిలివేలుపన్నిరుపైఁజల్లు ♦ పగరకునీబాకుబలుసుముల్లు
నీదుప్రసంగంబుమోదమైరంజిల్లు ♦ దనుజాళినీవన్నతల్లడిల్లు
నీకథల్ విననట్టినీచునిల్లేకొల్లు ♦ వింతగానీపనుల్ సంతసిల్లు
గీ॥ పాపకర్ముఁడు తెల్యకబహుగరొల్లు
సీతకైద్రుంచితివినాఁడుశివునియిల్లు
విదితకొల్లివిదెయ్యా సహృదయసంగ
పండరీపురవిఠలేశపాండురంగ॥ 100

సీ॥ కొమరొప్పకుంకులకుంటనివాసుండ ♦ వర్ణితరాడ్భట్టువంశజుండ
పరికింపగనురాళ్ళబండిసద్ గోత్రుండ ♦ నరయునప్పలరాజుయాత్మజుండ
రహిపూసపాటిశ్రీరంగరాట్ శిష్యుండ ♦ ఆరయమందరాజాభినుండ
రంగరాట్ కోటమరాజులకనుజుండ ♦ పరమభక్తులగొల్చుపావనుండ
గీ॥ వెంకటేశుండనినుమదివేడిపూలదండ గాగూర్చిపద్యముల్ దప్పకుండ
సలలితంబుగవ్రాతునిసిగళమునిండ పండరీపురవిఠలేశపాండురంగ॥ 101

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము

